నా శాసనము నిజమైనదైయుండి మొదటి శిల నశించుస్థితిలో దిరిగి యీ కాలపు వారు వ్రాయించియుండిరేమోనని విచారించదగియున్నది. క్రీ. పూ. అయిదారు శతాబ్దులనాటి శాసనములును, నాణెములును మనకు యిప్పుడు లభ్యమగుచునేయున్నవి. ఇది యింకను ప్రాచీనమైనదగుటచే మొదటి శిల యెప్పుడో నశించుస్థితిలో దానిని తర్వాతశతాబ్దులవారు పునరుద్ధరించుటలో నప్పటిలిపిలో వ్రాసియుందురా? ఈశాసనమందేగాక పెక్కు గ్రంథములలో గూడ యుధిష్ఠిరశక ముదాహరింపబడి యుండుటవల్ల దీనిని కేవలము కల్పితముగా త్రోసివేయజాలము. గాని అసలీ యుధిష్ఠిరు డెప్పటివాడో ముందు నిర్ణయించినగాని దీని యథార్థతను గనిపెట్టజాలము.

దీనినిబట్టి యుధిష్ఠిర శకారంభ సం॥ము ప్రమాది సంవత్సర మగుచున్నది గణితశాస్త్రజ్ఞుల లెక్కప్రకారముగూడ కలి ఆరంభసంవత్సరము ప్రమాదియే. కలి ఆరంభమైనతర్వాత 25 సం॥లకు యుధిష్ఠిరశకము ఆరంభమయ్యె నని చెప్పెడి పురాణములకుగాని, యితర జ్యోతిషగ్రంథములకుగాని, ఈ శాసనము సరిపోవుటలేదు. ఈవిషయ మటుంచి మనమిపుడు సూక్ష్మముగా విచారించినగాని సత్యము తేలదు. మనపూర్వులకు ఎంత నిజము తెలియునో ముందు కనుగొందము. జరిగిన మనువులయొక్కయు రాబోవు మనువుల యొక్కయు ఆదులను యీ క్రింది పండుగలుగా గణితశాస్త్రజ్ఞులు మన పంచాంగములం దిచ్చుచున్నారు.

(గతించిన మనువులు)

| | | | |
|---|---|---|---|
| 1. | స్వాయంభువమనువు | ఆది | కార్తిక శు ౧౨ |
| 2. | స్వారోచిషమనువు | ,, | ఆశ్వీజ శు ౯ |
| 3. | ఉత్తముడు | ,, | చైత్ర శు 3 |
| 4. | తామసుడు | ,, | భాద్రపద శు 3 |
| 5. | రైవతుడు | ,, | పుష్య శు ౧౧ |
| 6. | చాక్షుషుడు | ,, | ఆషాడ శు ౧౦ |
| 7. | వైవస్వతమనువు | ,, | మాఘ శు ౭ గాని మాఘ బ 30 గాని |



(రాబోవు మనువులు)

| | | |
|---|---|---|
| 8. | సావర్ణి (అగ్ని) | శ్రావణ బ 30 (రుద్ర) |
| 9. | దక్షసావర్ణి | కార్తిక శు ౧౫ |
| 10. | బ్రహ్మసావర్ణి | ఫాల్గుణ శు ౧౫ |
| 11. | భౌచ్యకసావర్ణి | జ్యేష్ఠ శు ౧౫ |
| 12. | సూర్యసావర్ణి | భాద్రపద బ ౮ |
| 13. | ఇంద్రసావర్ణి | కార్తీక బ ౮ |
| 14. | రుద్రసావర్ణి | ఆషాఢ బ ౮ (ధర్మ) |

రౌచ్యకమన్వాది యని చైత్ర శు ౧౫ ఒకటి కలదు గాని యిది లెక్కలో నిదిగా గానబడదు.

ఇంకను ధర్మసావర్ణి, భద్రసావర్ణి, దేవసావర్ణి యనువారల పేర్లు కాన వచ్చుచున్నవిగాని యవిగూడ పైవారలలో కొందరి రెండవ నామములే యైనట్లు కనబడుచున్నది. ఏలన, మొత్తము మనువులు 14 గురే గాని హెచ్చుగాదు. రాబోవు మనువులకుగూడ ఆదులు నిర్ణయించుట అసంభవము. అందును లక్షలసంఖ్యలలో నున్న సంవత్సరములందలి తిథులు మాసములు చెప్పుట యింకను అశక్యము. ఈ ఆదులన్నియు మనువులయొక్క జన్మాదులని అంగీకరించినచో నీ సందేహము విడిపోవుచున్నది. పైన నుడివిన యుగాదులకును యీ ఆదులకును సంబంధములేనట్లు మీరు గ్రహించగలరు. అందుచే నీ ఆదులు వారివారి జన్మముల ఆదులేయని తెలియవచ్చును. అయితే రాబోవు మనువులు ఆదులెట్లగునని ప్రశ్నవచ్చును. ఆ రహస్యమే మన మిపుడు స్పష్టముచేయవలసి యున్నది. మన పూర్వగ్రంథాలలో నన్నింటను జరిగిన చారిత్రక విషయములనే కమ్మీగా భావికాలవిషయములుగా మార్చి వ్రాసినట్లు అనేక దృష్టాంతాలున్నవి. భాగవతాదులలోను పురాణములలోను క్రీస్తు పూర్వమును తర్వాతను పాలించిన యనేకరాజుల విషయాలు అశోకచక్రవర్తి, ఆంధ్రరాజులు మున్నగువారివి భావిచరిత్రలక్రింద వ్రాయబడినను నిజమున కా భాగములన్నియు దర్వాత చేర్చబడినవే యనుట స్పష్టము. అదేవిధముగా నీ మనువుల విషయమును జరిగినది. దీనికి